శ్రీ

# ఊరుభంగము

Uru bhangamu

(శ్రీ భాస మహాకవి కృతికి)

Sri Bhasa mahakavi

(ఆంధ్రానువాదము)





ఆంధ్రీకర్త

విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మ

# ప్రశస్తి

—o—

కాళిదాస మహాకవిచేఁ గీర్తింపఁబడిన భాసమహాకవి రచించిన నాటకచక్రములో "ఊరుభంగ" మొకటి. ఇందు భీమసేనుఁడు దుర్యోధనుని యూరువుల భంగమొనర్చి తన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనిన గాథ ప్రధానకథావస్తువు. ఆలంకారికుల వ్యాయోగ లక్షణము దీనికి సరిపోవుచున్నందున ఏతత్కవి రచించిన యితరదృశ్యమగు 'మధ్యమ వ్యాయోగము'వలె నిదియు వ్యాయోగ మగునని గ్రహింపవలసి యున్నది.

దృశ్యకావ్యములోని వస్తు వెట్లున్నను తుద కయ్యది సుఖాంతమై యుండవలెనని చాలమంది కవుల యభిప్రాయము కాని విషాదాంత దృశ్యములు కూడ నుండవచ్చునను సంగతి నీ "ఊరుభంగము" తెలుపుచున్నది నాట్యదర్పణమును రచించిన రామచంద్ర, గుణచంద్రులు—హేమచంద్రుని శిష్యులు విషాదాంత నాటకము లుండవచ్చునని చాటి యున్నారు. రసములన్నింటివలనను గలుగునది విగళితవేద్యాంతరమగు నానందమే కావునను, ప్రేక్షకులు నాటకములఁ జూచుట సుఖానుభూతికే యగుటవలనను విషాదాంతములు నిషిద్ధములు కావని గ్రహింపవలెను

భాసుని "ఊరుభంగము"ను ఇతర దృశ్యకావ్యములతోఁబాటు తిరువనంతపురమునందలి సంస్కృతగ్రంథ మండలివారు మహామహోపాధ్యాయ, శ్రీ త. గణపతిశాస్త్రులుగారి పర్యవేక్షణమునఁ బ్రకటించిరి. పిదప దీనిని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారు తెలిఁగించిరి: సుప్రసిద్ధ పండితకవులగు శ్రీ వేదం-వేంకటకృష్ణశర్మగా రిప్పుడు దీని నాంధ్రీకరించి ప్రకటించుచున్నారు.

శ్రీ లక్ష్మీ నరసింహకవిగారి యనువాదములు ఇప్పుడు సామాన్యులకు లభ్యములు కావు. సంస్కృతభాషా పరిచితి లేని తెలుఁగువారికి భాస నాటకముల వైశిష్ట్యమును తెలిసికొనుటకు వాని యనువాదములు కావలసి యున్నవి. వానిని సంస్కృతాంధ్రములలో విద్వాంసులయి, చక్కని కవిత్వము చెప్పఁగలవారు తెలిఁగింపఁబూనుకొనుట మెచ్చఁదగిన యంశము.

శ్రీ వేంకటకృష్ణశర్మగారీ వఱకే మహాకవి దిఙ్నాగుని 'కుందమాల'ను తెలిఁగించి యంధ్రుల యాదరమునకుఁ బాత్రులైనారు. మదరాసు విశ్వవిద్యాలయమువా రా గ్రంథమును పట్టపరీక్షకుఁ బఠనీయముగ నిర్ణయించి శ్రీ శర్మగారిని గౌరవించినారు. అసర్గళధారతో ఆంధ్రగీర్వాణములందు చక్కని కవిత నాగింపఁగల కొలఁదిమందిలో శ్రీ శర్మగారొకరు! పలుచోట్ల జానుతెలుఁగు పదములను కూర్చుచు రసానుగుణమగు రచనను సాగించిన శ్రీ శర్మగారి యీ రచన మధురతర మనుటకు సందేహములేదు. మచ్చునకు రెండుదాహృతులు—

మూలము—

ఆక్షిప్త లాఙ్గలముఖోల్లిఖితైః శరీరైః
నిర్దారితాంసహృదయా న్ముసలప్రహారైః
దాస్యామి సంయుగ హతా న్రథాశ్వనాగాన్
స్వర్గానుయాత్ర పురుషాం స్తవ పాణ్డుపుత్రాన్॥

అనువాదము—

గీ. హలముతోఁ బాండుసుతుల దేహములు దున్ని
ముసలమున వారి యంసోరములను దంచి,
రథగజాశ్వాలతో నని గ్రుందఁజేసి
పంపుదును నిను వెనుకొన స్వరమునకు.

మూలము—

భిన్నా మే భ్రుకుటీ గదానిపతితైః
వ్యాయుద్ధకాలోత్థితై
ర్వక్షస్యుత్పతితైః ప్రహారరుధిరై
ర్ధారావకాశో హతః
పశ్యేమౌ వ్రణకాంచనాఙ్గదధరౌ
పర్యాప్తశోభౌ భుజౌ
భర్తా తే నపరాఙ్ముఖో యుధి హతః
కిం క్షత్రియే రోదిషి॥

అనువాదము—

చ. బెడిదపుఁబోరిలో భ్రుకుటి
బెట్టిదమౌ గద వ్రస్సిపోయె. నా
కడిఁదియురమ్ము గాయములఁ
గాఱెడు నెత్తురు హారదేశముం
దొడరె, బలాతిదోర్యుగిఁ గ
నుంగొనుమీ వ్రణకాంచనాంగదా
లడరె. ననిం బరాఙ్ముఖత
నందఁడు నీపతి యేల చింతిలన్?

శ్రీ శర్మగారి కవితాతత్త్వమును గుర్తించుటకుఁ బయి యుదాహృతులు చాలును. ఇట్లు రసవంతములుగ గ్రంథములను రచింపఁగల శ్రీ వేంకటకృష్ణశర్మగారిట్లే యపూర్వగ్రంథములను వెలయించుచు ఆంధ్ర భాషామతల్లిని సేవించుచుందురుగాక!

భాషాసేవకుఁడు

మదరాసు
8-9-51

బులుసు వేంకటరమణయ్య.

# అవతారిక

భాస మహాకవి నాటక చక్రమున నీ 'యూరుభంగ' మొక యేకాంకికము. ఇందలి యితివృత్తము మహాభారత సంగ్రామాంత్య కథాభాగము. రూపక లక్షణానుసార మియ్యది 'వ్యాయోగము' 'సాహిత్యదర్పణము'న దశరూపకమున- 'వ్యాయోగ'-లక్షణ మిట్లు చెప్పఁబడినది.

'ఖ్యాతేతివృత్తో వ్యాయోగః స్వల్ప స్త్రీజన సంయుతః
హీనో గర్భవిమర్శాభ్యాం నరై ర్బహుభి రాశ్రితః
ఏకాఙ్కశ్చ భవేదస్త్రీ నిమిత్త సమరోదయః
కైశికీ వృత్తి రహితః ప్రఖ్యాత స్తత్ర నాయకః
రాజర్షి రథ దివ్యోవా భవేద్ధీరోద్ధతశ్చ సః
హాస్య శృంగార శాన్తేభ్య ఇతరేత్రాంగినో రసాః॥'

ఈ లక్షణములన్నియు 'ఊరుభంగము'నఁ గాననగును. ఏకాంక దృశ్యములలో దీని కొక విశిష్టస్థానము గలదు. భాషా సౌష్ఠవముననే కాక, నాటక కళా పోషణమునను గవి మిగులఁ జాకచక్యమును బ్రదర్శించెను. భాసుఁడు, కావ్యశైలిలోఁ గడుంగడు నిపుణుఁడని యాతని గద్య పద్య రచనలు చెప్పకయే చెప్పుచున్నవి.

ప్రాచీన నాటకములకు భిన్నముగ నాటకకర్త వధవిధాన రూపక భయంకర దృశ్యమును దుదిం బ్రవేశపెట్టి, దుర్యోధనుని యపజయాప మృత్యువులతో నీ నాటికను విషాదాంతముగ ముగించెను. దీనింబట్టి సంప్రదాయజ్ఞులగు నాటకకర్తలు గూడ, ఇట్టి నాటకములను రచింప సమకట్టిరని మన మూహింపవలసి యున్నది. విషాదాంత దృశ్యములును గొందఱి మతమున సమ్మతములు.

అంకావతరణములోని యిరువురు వీరభటుల సంగ్రామ వర్ణనము శ్రవ్యకావ్య ధోరణిలోఁ బడుటచే, భాసుని తక్కిన నాటకములలోకంటెఁ బటుత్వముగల శబ్దజాలముతో రచన మించుక జటిలమై రసానుగుణముగ నెనలారుచున్నది.

# VI

## నాటకకర్తచేఁ జేయఁబడిన మార్పులు

1. మహాభారతమున నర్జును సైగచే భీముఁడు సుయోధనుని తొడలం బడఁ గొట్టినట్లుండ, నిందది కృష్ణుని సైగచే జరిగినట్లు చెప్పఁబడినది.
2. మహాభారతమునఁ బ్రేక్షకులలో ద్వైపాయన విదురులు పేర్కొనఁబడ లేదు; ఇందుఁ బేర్కొనఁబడిరి.
3. మహాభారతమున గదాయుద్ధావసరమున గూడ ధృతరాష్ట్రాదులు శమంతపంచకమునకు రాక, హస్తిపురి నున్నట్లుండ, నిందు విదురుఁడు దోడ్కొనిరా, గాంధారీ ధృతరాష్ట్రులు రణరంగమునకు వచ్చినట్లు చెప్పఁబడినది.
4. మహాభారతములోవలెఁ గాక, యిందు సుయోధనుని స్వభావ మత్యుదాత్తముగఁ జిత్రింపఁబడినది:—

౧. మహాభారతమునందువలె, నిందు శ్రీకృష్ణుని నిందింపఁడు.

౨. తన యవినయ కృత్యమునకుఁ బశ్చాత్తప్తుఁ డగును.

౩. పాండవులను బ్రదుకనిమ్మని వేఁడుకొనుచు బలదేవు నోదార్చును.

౪. న్యాయయుద్ధమునఁ గాక, వంచనమునఁ గూలితినని బలరాముఁ డన్నపు డెంతయుఁ దృప్తి నొందును.

౫. నిశాసమయమునఁ బాండవుల సంహరింతునని యశ్వత్థామ ప్రతినఁ గైకొన్నపు డతఁ డేమాత్రము సంతసము వెలిపుచ్చక పోవుటయుండ, నతని నా యుద్యమమునుండి మరలింపఁ బ్రయత్నించును.

5. మహాభారతములోవలె నశ్వత్థామ ప్రతిజ్ఞాపూరణానంతరము గాక, సుయోధనుఁ డిందు ముందే మరణించినట్లు చూపఁబడినది.

## ఆంధ్రానువాదము

భాస నాటక చక్రములోని తక్కిన వానిలోఁ గొన్నింటిని సుప్రసిద్ధులగు కవులెందఱో తెలిఁగించిరి. కాని, యీ 'యూరుభంగము'— పెక్కుర

దృష్టి నాకర్షించినట్లు కనఁబడదు. కావున, దీని మన తెనుఁగువారి కుపాయనముగ నందింపవలెనను నుత్సాహముతోఁ జేత నయినట్లాంధ్రీకరించితి. ఈ వ్యాయోగము వీర భయానక బీభత్స కరుణ రస సమ్మిశ్రితము. అందు మొదటిది ప్రధానము; తక్కినవి యంగములు. ఈ రసముల నాయాయి ఘట్టములఁ బోషించుటలో భాసుని సామర్థ్య మత్యద్భుతముగ భాసించినది. అట్టి ఘట్టములలో నేను నతని యడుగు జాడలలోనే నడిచి రసోచిత శబ్దజాలాభివ్యక్తి సేయఁ దప్పినది కాను. విజ్ఞలోకము ముందలి గుణలేశము గ్రహించిననాఁడు నాకృషి చరితార్థమై వెలయఁగలదు.

## కృతజ్ఞత

నామీఁదను, నా రచనలయందును దయఁ గల యమితాదరాభిమానములం బురస్కరించుకొని, యీ కృతిని త్వరితముగఁ బ్రకటింపఁ జేయు నుబలాటముతో సహజౌదార్యస్వభావులు నగు నన్నుం బురికొల్పిన మన్మిత్రోత్తములగు శ్రీ ఏ. యం. ఎస్. చెంగల్రాజుగారి కెంతయు నేను ఋణపడి యున్నాఁడను. ఈ కాగితపుఁ గఱవు దినములలోఁ దమంత వ్యయప్రయాసల కోర్చి దీని కగు పత్రిప్రపంచమును సంతరించి యిచ్చిన యుదారస్వభావులు శ్రీ రామదాసు చౌదరి, బి. ఏ. గారి యుపకృతి మఱువరానిది. సాహితీసేవకే తమజీవిత మంకిత మొనర్చినవారగుట, ఈ యనువాదవిషయము నాలకించినంతన, స్వయముగ ముచ్చటపడి, గ్రంథము నంతయుఁ బరిశీలించి ప్రశస్తి వ్రాసి యొసంగిన సాహిత్యాగ్రణులు విద్వత్కవీంద్రులు బ్రహ్మశ్రీ బులుసు వేంకటరమణయ్యగారి మిత్రవాత్సల్యత కొనియాడఁ దగినది. వీరి కెల్లరకు గృతజ్ఞతాపూర్వకముగ వందనము లర్పించుచున్నాఁడను.

10-9-1951
మద్రాసు

వేదము వేంకటకృష్ణశర్మ.

## సమర్పణము

కలిదేవ! మహాభారత
కలిదేవా! యూరుభంగ కావ్యము మత్స్వం
కలితానువాద మమితో
త్కలికాత్మను నిడితి నీపద ద్వయిఁ గొనుమా!॥

గ్రంథకర్త.

ఈ రూపకమున వచ్చుపాత్రలు :—

పురుషులు :

భటులు
బలదేవుఁడు :—(దుర్యోధనునకు గదా యుద్ధమున గురువు)
దుర్యోధనుఁడు :— (కురురాజు)
ధృతరాష్ట్రుఁడు :—(దుర్యోధనుని జనకుఁడు)
దుర్జయుఁడు :—(దుర్యోధనుని పుత్త్రుఁడు)
అశ్వత్థామ :—(ద్రోణ పుత్త్రుఁడు)

స్త్రీలు

గాంధారి :—(కురురాజు జనని)
దేవేరులు :—(కురురాజు మహిషులు)



# ఊరుభంగము

## (భాసనాటకమునకాంధ్రానువాదము)



(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్రధారుఁడు :—

సీ. * సురనదీసూనుండు గురుఁడును తీరమ్ము ;
అల జయద్రథభూపుఁ డరయ జలము ;
శకునిగ్రాహదం, అంగజనపతి ద్రౌణి కృ
పుల్ కెరటాల్, నక్రములును, మీలు ;

---

పాఠాంతరములు :—

1 * గురుభీష్ముల్ తటముల్ ; జయద్రథుఁడు ప్రాఁకొన్నీరు : గాంధారభూ
వరుఁడావర్తము, అంగనక్రమకరాల్ భాస్వత్సుత ద్రౌణు, లు
ద్ధుర శక్తుండు కృపుండు ; వెల్లి కురునాథుం ; డస్త్రపుఁ సైకతం
అరుదౌ శత్రునదిన్నరుం గడపఁ దెప్పౌదేవుఁ డోమున్మముఁ॥

2 * నదిజగురులొడ్లు ; జలము సైంధవుఁడు ; శకుని
సుడియు ; రవిజుండు, ద్రౌణి, కృపుఁడు తరఁగలు,
మొసళులున్మీలు ; వెల్లిరా, జెసఁగు పగతు
తేటి నరుఁ గడుపు నోడ యాకృష్ణుఁ డోము ॥

దుర్యోధనుఁడు వెల్లి ; దురధిగమ శరాసి
సైతమ్ములుగల శత్రుతటినిఁ
బాండవమధ్యమ ప్రవరుఁ డేయోడచే
దాఁటనేరిచె ;—నాయుదారతరణి.

* కేశవుఁడు, వాసవాది లోకేశనుతుఁడు
దర్పపరిపంథి సముదగ్ర తరణమునకుఁ,
బరమకృపఁ దోడుపడి, మిమ్ముఁ, బ్రత్యహమ్ముఁ
గాచుఁగావుత ! రసికప్రకాండులార !॥

ఆర్యమిశ్రుల కిట్లు విన్నవించు కొందును.—

ఆ ! ఏమిది ? నేనిట్లు విజ్ఞాపన మొనర్చుకొను నవసరముననే—యేదియో శబ్దము వినవచ్చుచున్నది !—మంచిది ! వినుఁగొందునుగాక !

(నేపథ్యమున)

ఇదిగో, మేము ఇదిగో, మేము.

సూత్రధారుఁడు :—ఔను, ఇపుడు తెలిసినది.

(ప్రవేశించి)

పారిపార్శ్వకుఁడు :—బావ ! వీరేలొకో, యిట్లు,—

చం. మదగజరాజ దంతముల
మాటికి గీఱుబాఱు దేహము
ల్వాదల, శరాశి తోమర స
మూహ విభిన్న నిజాంగకంబులుం

చెదరఁ, బరస్పరమ్ము విల
సిల్లెడు వీర్యములోఁతు సూడనాన్
గదనమహాగ్ని వ్రేల్చెదరు,
క్రౌర్యమునం. దివినొంద, మేనులన్.

సూత్రధారుఁడు:—మారిష! నీవెఱుంగవా యేమి? ధృతరాష్ట్రుని పక్షమున నతని నూర్వురతనయులు అను నయనములు నశించి, దుర్యోధనుఁడు మాత్రము మిగులఁగా,—యుధిష్ఠిర పక్షమునఁ బాండవవాసుదేవు లసువులతో నలరఁగాఁ, బుడమిఱేండ్ల కళేబరములచే నిండియున్న శమంతపంచకమునం దిపుడు.—

గీ. ఇదిగో, భీమసుయోధను లెసఁగిపోరఁ
జినిఁగిపోయిన చిత్తరువునఁ గలంగు
వ్రాఁతవలెఁ గ్రాలు హతగజాశ్వనృపరణము
జనవరవధైకవసతిఁ జొచ్చెను భటాళి॥

(నిష్క్రమింతురు)

స్థా ప నా



(ముప్వురుభటులు ప్రవేశింతురు)

అందఱు :—ఇదిగో, మేము. ఇదిగో, మేము.

ప్రథముఁడు :—

శా. వైరావాసము. బాహుశక్తి కొరగల్.
భవ్యాత్మదర్పప్రథా
గారం, బప్సరసా స్వయంవరణ రం
గంబుగా, సిద్ధప్రౌఢతో
దారక్రాంతికిఁ దావు, భూపస్మృతిశ
య్యాస్థాన, మాయుర్హుతా
పారాగ్నిక్రతువుగా, రణాశ్రమము, భూ
పాలాశ్రిత మార్గం బిదే॥

ద్వితీయుఁడు :— చక్కఁగా వచించితివి.

మ కరిరాట్కాయపుఁ గొండతాల గడునా
క్రాంతాసమ స్థానముల్
బెరయం, దిక్కుల గూండ్లు గృధ్రములు గా
వింపగా, రథంబుల్ రథుల్
దొరఁగగా, మిత్తి గడించు చర్యల, ననిం
దూఁకొన్నరాజుల్, పర
స్పరముగామార్కొని పోరిపోరి చిరముం
బ్రాపించి రా నాకముగా॥

తృతీయుఁడు:—అది యట్లే యగు.

చం కరిపరదంత యూపమయి.
కాండపరిస్తృతదర్భమై, హత

ద్విరదచయోచ్ఛమై. వివుత
భీషణ పావకదీప్తమై. ధ్వజో
త్కరసువితానమై. భటవి
తానపు టాఱుపె ఘంత్రమై. పత
న్నరపళుపైన యుద్ధసవ
నం, బిదె యెంతయు భాసిలుంగదా ॥ ౬

ప్రథ :—ఇదిగో, యీ ప్రదేశముం గనుఁడు.—

గీ. ములుకులఁ బరస్పరం బుసురులఁ దొరంగి
పౌలికలని ముంగిటం దేహములు పెలంగు
రాజుల శరీరభూషలు రాల్చు చలరుఁ
బలలమున నానుముక్కులఁ బులుఁగు లివిగొ ! ౭

ద్వితీ :—

గీ. శరశరాసనయుత మయి, సకలసమర
తంత్రములకుఁ గడంగిన దంతి—తేని
యాయుధాగారమట్లు నితాంతబాణ
తతిని మైమఱు వగలఁగఁ దనువు విడిచె॥ ౮

తృతీ :—ఇదే. యిట చూడుఁడు.—

గీ. ఇదె పతాకాగ్ర మాలికల్వడి శిరమున,
స్రగ్వియగు రథి, లగ్నైకశరు. విపన్ను
నాఁడునక్కలు డిగనీడ్చు చలరు, నల్లుఁ
బల్లకిం దింపు చుట్టాల పడఁతులట్లు॥ ౯

అం :—ఔరా! భూతనంబున గండడంగి, కండతుండెములయి మెండుగ నిండియుండు వేదండ వాజి భట చటుల రుధిరప్రవాహాతిశయమునఁ బ్రవేశింపరానిదియు, నదవదలయి చెదరిన వర్మచర్మాతపత్ర చామర తోమర శర కుంత కవచ బంధాదికంబులఁ గలగుండు వడినదియు, శక్తి ప్రాస పరశు భిండిపాల శూల ముసల ముద్గర వరాహకర్ణ కణయ కర్పణ శంకుత్రాసి గదా ప్రముఖాయుధములు గలదియు నగు నీశమంత పంచకమతి భయంకరముగ నున్నది.

ప్రథ :—ఇదిగో, యియ్యెడ—

చం. తునిఁగిన యేన్గుగట్లపయిఁ
దోవల రక్తనదుల్ తరింపనౌ,
జనపతిశూన్యముల్ దొరఁగు
సారథు లీయరదమ్ము లీడ్చు వా
హనములు, శీర్షముల్ దొలఁగి
యట్టలు పర్విడుఁ దొంటివాడుకన్
జనియెదు నిట్టునట్టు మద
సామజము ల్దమ మూవటుల్వడన్॥ ౧౦

ద్వితీ :—ఇట నిదిగో, చూడుఁడు! యీతావున—

చం. లలిత మధూక కోరకము
లంబలె నున్నతపింగళాక్షముల్
బలిమదవారణాంశుక వి
భాస నమంచిత తీక్ష్ణచంచువుల్

పొలుపుగ మింటఁ జాగి పొల
మక్కులతోఁ బవడంపు పీజనల్
వలెఁ గడు విస్తృతంబులయి
పర్వెడు ఱెక్కలు గ్రాలు గృధ్రముల్ ౧౧

తృతీ :—

గీ. వాజి గజ నృప యోధులు పడిన కలనఁ
దరణి తీవ్రాంశువులను నంతట వెలుంగు
ప్రదర నారాచ కుంతాసి భల్లసమితి
పతితతారాళి భువి తాల్చుపగిదిఁ దోఁచె॥ ౧౨

ప్రథ :—ఔరా! యిట్టియవస్థయందును క్షత్త్రియులు తమ మగఁటిమి విడువక కడుంగడు విరాజిల్లుచున్నారు.

శా. ప్రస్తోద్వర్తితనేత్ర బంధురతతుల్
రక్తోష్ఠ పత్త్రోత్కరాల్,
శస్త్రభ్రూకుటి కేసరాల్, స్వముకుటాం
చద్విద్ధ సంవర్తికల్,
విస్తీర్ణాంచిత వీర్యసూర్యభిదముల్
విత్రస్తముల్, బాణనా
శస్త్రోమోన్నతముల్. మహీశముఖముల్
శ్మపద్మినింబోలెడిన్॥ ౧౩

ద్వితీ :—ఇట్టి క్షత్త్రియవీరులనుగూడ మృత్యువాక్రమించెఁగదా! విషమ పరిస్థితులలో నున్న మానవుల కాత్మబలమువలని యుపయోగ మొండదుగదా!

తృతీ :—మృత్యువుమాత్రమే క్షత్త్రియులఁ నాక్రమించునది.

ప్రథ :—అందులకు సందియమేమి ?

ద్వితీ :—కాదు ; మీరట్లనకుఁడు.

మ. సరగన్ ఖాండవధూమ వృత్తగుణమున్
సంశప్తకోత్సాదమున్,
సురలోకార్తిహమున్, నివాతకవచా
సుస్స్వాదమున్ జాపమున్
గరమందుం గొని శంభుతోఁ గలహమున్
గావింపఁగా, శిష్టమౌ
శరరాజిన్ విజయుం డనిం గెడపె రా
జన్యేషులం, దర్పునన్॥ ౧౬

అం :—ఔరా ! ఈ శబ్దమేమి ?

ఉ. వారిద గర్జ యేమొ ? ; పవి
పాత విచూర్ణిత శైలశబ్దమో ? ;
ఘోరపు వజ్ర రావ భయ
తుందిలతం భువి చీఱచప్పుడో ? ;
వారిధి, మందరాద్రిఁ గల
బంధుర కందర గహ్వరంబులం
దూఱఁగ, గాలిచే నెగసి
త్రుళ్లు తరంగపుఁజాళ్ల ఘోషయో ?॥ ౧౭

మంచిది కనుఁగొందముగాక ! (అందఱు పరిక్రమింతురు)

ప్రథ :— ఆహా! ఇదిగో, ద్వైపాయన బలభద్ర కృష్ణ విదురాదులును, గౌరవయాదవ కులదైవములును ప్రత్యక్షముగ వీక్షించుచుండ, ద్రౌపదీకేశఘర్షణమున విజృంభించిన పాండవమధ్యముండగు భీమసేనునకును, భ్రాతృశతము వధింపఁబడుటచేఁ గ్రోధోద్రిక్తుఁడగు దుర్యోధన మహారాజునకును గదాయుద్ధము ప్రారంభమయినది.

ద్వితీ :—

చం. కరఁగిన పైఁడిబండవలెఁ
గ్రాలెడు భీమునురమ్ము వెల్గఁ, జం
దర సురహస్తిహస్తకఠి
నమ్ము సుయోధనుమూఁపుఁ జెల్వఁ
దోఁపల భుజద్వయాంతరము
లొందిన చండగదాయుధమ్ములం
బరిపరిఁ దాఁకఁ, బుట్టిన య
వారణ దారుణరావ మారయన్॥ ౧౬

తృతీ :— ఇదిగో, మహారాజా —

చం. శిరము గదల్పగాఁ దొరఁగు
శీర్షకముం, గడుఁ గోపవహ్నికా
షరుచిముఖంబు, మార్పుగతి
గల్గుట వంగెడు మేను, మాటి కు
ప్పరమునఁ జాఁచు కేలు, ప్రతి
పక్షునినెత్తుటఁ దోఁగు చేగదం
బరఁగఁ జెలంగు నాకరిపు
మందు పవిం గల వెండికొండనాఁ॥ ౧౭

ప్రథ :—ఇదిగో, వ్రేటులచేఁ గలిగిన గాయములనుండి జాలువాఱు రక్తమునఁ దడిసిన యంగకములం దనరు నీ పాండవుం జూడుఁడు.

చం. నిటలము వ్రీలుటం దొరఁగు
నెత్తుటితో, నిరుమూఁపు సంపెటల్
బటువఱ, వ్రేటులం గురియు
బంధురరక్త మురమ్ముఁ గ్రమ్మ, ను
త్కటపు గదా ప్రహారములఁ
గాఱెడు నల్లను దోఁగు గాయము
ల్పటుతర ధాతుసార శిల
లంగల మేరున శీతఁడీదగున్॥ ౧౮

ద్వితీ :—

గీ. భయదగద వ్రేయ, దూఁకి బొబ్బలు వొనర్చుఁ,
దనభుజము వేగఁ గొను దాయతలఁపు నాఁగు
నడుచు నాట్యపునడకల, విదక యడుచు
భూపుఁడు సుశిక్షితుండు, భీముండొ బలుఁడు॥ ౧౯

తృతీ :—ఈ వృకోదరుఁడు—

గీ. తల మివులలోఁతు దెగి, నెత్రు తనువుఁదడుపఁ
గొండవలె, నని, నప్రమేయుండ యయ్యు,
భిదురపాతాన ధాతువుల్ పెదరు నద్రి
రాజు మేరువునటు నేల వ్రాలఁదొడఁగె॥ ౨౦

ప్రథ :—బటువగు గుదియవ్రేటులచేఁ జదిసి నడలిన యవయవములతో నేల వ్రాలుచున్న యీ భీమసేనుం జూచి—

మ. ఒకప్రేల న్మొగమెత్తి వ్యాసుఁడదె యత్యుత్సాహియై కాంచె,

ద్వితీ :—

దీనకళం ధర్మజుఁ డేఁగెడుఁ విదురుఁడుం దా నశ్రువుల్ రాల్చె,

తృతీ :—

జంకక గాండీవము గ్రీడి చేకొనె, దివిం గాంచె న్ముకుందుండు,

అం .—

ప్రేక్షకుఁడౌ రాముఁడు ద్రిప్పె నాగటిని, శిష్యప్రీతి సంధింపఁగన్॥ ౨౧

ప్రథ :—ఈ మహారాజు— —

గీ. మాన వినయ కళా ధైర్య మహితధనుఁడు,
వినయమున కిల్లు, పలురత్నవితతి రచిత
మకుటుఁ, డిదెవల్కె : "భీమ ! పొందకుముభయము
అసమొనం దీను పీఁరుడు చెనకఁ డెపుడు" ౨౨

ద్వితీ :—పరిహాసమునకు గురియయిన భీమసేనుపంకఁ జూచి, జనార్ద నుఁడు తనతొడఁ దట్టుటచే నేదియో సైగ సేయుచున్నాఁడు.

తృతీ :—ఆసంజ్ఞవలన వాయుసుతుఁ డూఱట గనినట్లున్నాఁడు.

ఉ. ఆంగగు భ్రూకుటి న్నొసటి
యందలి చెమ్మటఁ గేలజార్చి, చి
త్రాంగదమన్గదం బుజము
లందునఁ దాలిచి, బొబ్బవెట్టుచుఁ
సింగపుఁగన్నులంబలె రు
చిం గడుపెగ్గెడు తన్ను, దీపఁ, బ్రే
మంగని, తండ్రి, గాలిబల
మందితుఁ జేయఁగ లేచి నిల్చెడిఁ॥ ౨౪

ప్రథ :—అకటా ! గదాయుద్ధము మరలఁ బ్రారంభమయినది.

మ. పుడమిం బాణితలంబు రాయుచు, భుజం
బుల్దట్టుచున్, వాతెఱన్
వడి సందష్ట మొనర్చుచు, న్విపుల స
త్త్వక్రోధుఁడై యార్చుచున్,
గడు ధర్మాత్మకృపన్ రణక్రమముఁ బి
క్కంజూచి, దుర్యోధనుం
బొడపైఁగొట్టె గదన్ మురారిసయిగం
దోర్దోడ భీముం, డిదే॥ ౨౪

అం :—అకటా ! మహారాజు నేలఁ గూలెఁగదా !

తృతీ :—రక్తపాతము చే వెలుంగు నయనములతో ధరణీతలంబున కొఱగు
చున్న కురురాజుంజూచి పూజ్యుఁడు భగవంతుఁడు ద్వైపాయనుఁ
డంతరిక్షమున కెగసెను.—ఇట నిప్పుడు—

శా. మాలాసంవృతలోచనుండగుటఁ గ
న్మాటయ్యె నీవృత్త మా
తాలాంకాక్షుల, కాతఁ డెప్డుగని క్రో
ధంబూనె శిష్యార్థ, మా
వేళన్ వేగమ చేతులం బొదివి యా
భీమున్, యదూత్తంసుదో
ర్లీలారక్షితు, వ్యాసునానతిని నో
లిం జేసి రాపాండవుల్॥ ౨౫

ప్రథ :—ఔరా! అత్యంతకోపావిష్టుండగుటఁ గదుంగదు విస్ఫారిన విలోచనములతో భీమసేనుఁ డొకసరియుటం గాంచుచు, నీదిక్కునకే యరుదెంచెను. ఈతఁడు—

చం. వదలి చరించుజుట్టు, నెఱ
వడ్డ విశాలవిలోచనంబులఁ,
షవమధుపాస్యదష్టమయి
మందత నించుక లేచు మాలయుం,
గుదులు శరీరముం, దొరఁగఁ
గూడఁగలాగు వినీలవస్త్రముం
బొదల, ధరిత్రికిం దిగిన
పూర్ణశశిం బరివేషిఁ బోలెడిఁ॥ ౨౬

ద్వితీ :—అట్లయిన మనమును బోవుదము; రండు. మహారాజుసన్నిధి మందము.

ఇరువురు :—మంచిది. ఇది యత్యుత్తమమయిన యభిప్రాయము.

(నిష్క్రమింతురు)

ఇది విష్కంభకము



(అంత బలదేవుఁడు ప్రవేశించును.)

బలదేవుఁడు:—ఓ పార్థివులారా! ఇది పాడికాదు.

గీ. అహిత సైన్యాంతకము నాముహలముఁ గనక
యనిని దనవంచనమును నన్నును దెలియక,
దర్పమున, రణమున సుయోధనుని తొడయుఁ
గులవినయసంపదం గదఁ గూల్చె నితఁడు॥ ౨౦

ఓయీ! దుర్యోధన! జీవములతో నొక ముహూర్తముందువు గాక!
ఇంతలో—

శా. సౌఖాస్యాంతకము, న్మహాసురపురో
చ్చంబైన ప్రాకారకూ
టాభీలాంకుశముం, గళిందజకు వా
ర్యాదేశకం, బర్యసుః
ప్రాభృత్సేవితముఁ హలంబుఁగొని, ఘ
ర్మాసృక్సమూర్ధ్రాయితం
బీ భీమోరము మళ్లచాళ్లొనరుతుఁ
హేలాగతిం జూడుమా॥ ౨౧

(నేపథ్యమున)

పూజ్యులు హలాయుధులు ప్రసన్ను లగుదురుగాక:

బల:—అకటా! కనికరింపఁదగిన యిట్టి స్థితియందును, ఈ దుర్యోధ
నుఁడు నన్ననుసరించెడు ఈతఁడు—

మ. అసృగార్ద్రాహవ చందనోల్లసితకా
యాభుండు. శ్రీమంతుఁడుఁ

విస్పృతోర్వీకణ పాటలోరుభుజుఁ, డెం
తే, బాలలీలావ్రత
వ్యసనుండొప్పు సుధార్థమై చిలికి దై
త్యామర్త్యాలావాసుకిన్
వెసఁ గొండన్విడఁజేయ మూఁటకు న
బ్ధిం జేర, మేనీడ్చు నాన్ ౨౯

(అంతఁ దొడలు విఱిగిన దుర్యోధనుఁడు ప్రవేశించును)

దుర్యో:—ఇదిగో నేను—

గీ. అకట! భీముఁడు సమయనియతిఁ ద్యజించి
గదఁ బ్రయోగింప, క్షతముల నదవదలగు
తొడలతో, సగముడిగిన యొడలిఁ బుడమి
బాహువుల నీడ్చుకొనుచు నీ పగిదిఁ దాల్తు॥ ౩౦

పూజ్యులు హలాయుధులు ప్రసన్నులగుదురు గాక!

గీ. నేలఁబడిన నా తల మీ పదాలు సోఁక
మ్రొక్కి వేఁడెద విడువుండు రోషమింక
నల కురుకుల నివాపాబ్దములె బ్రదుకుత!
పగయు రణవృత్తమేమును ముగియనిండు॥ ౩౧

బల:—ఓయి దుర్యోధన! ఒక్కింతసేపాఁగుము.

దుర్యో:—మీరేమొనర్తురు?

బల:—ఓయి! ఆలింపుము.

గీ. హలముతోఁ బాండుసుతుల దేహములు దున్ని.
ముసలమున వారి యంఘ్రోరములను జించి.
రథగజాశ్వాలతో నని ప్రమందఁజేసి,
పంపుదును విను వెనుకొన స్వర్గమునకు॥ ౩౨

దుర్యో:—వలదు, వలదు. అట్లొనర్పకుఁడు.

కం. వడముడి ప్రతిన ఫలించెం,
బడియె రణాంగణమునందు భ్రాతృశతం, బీ
వడువున నున్నాడను నే,
నుడుగని పగవలన నేమి యొఱగును దేవా! ౩౩

బల:—నీవు నాకన్నులయెదుటనే వంచించఁబడితివిగదా యని నేను కినుక నొందుచున్నాఁడను.

దుర్యో:—నేను వంచితుఁడనని మీ రూహించుచున్నారా?

బల:—సందియమేమి?

దుర్యో:—అహా! సంతోషమయినది. నాజీవితము నేఁడు సార్థకమయినది. ఏలయన—

శా. ఆదీప్తానల దారుణంబయిన లా
క్షావాస మేధీరుఁడెం
తేఁ దెల్వి న్విడఁజాలె. నెవ్వఁడు ధరి
త్రీద్రోపలాల్ పోరిలో
మోదెం దానలకా, మఱెవ్వఁ డసువు
ల్వాచ్చె హిడింబాసురుకా,
వేదోరించెఁ గుయుక్తి భీముఁడిటు కా
నీ, గెల్వలేనా? గురూ! ౩౪

బల :—సమరమున నిన్నిటు మోసగించిన భీమసేనుఁడు సుఖముగ నింక ను జీవించపరెనా ?

దుర్యో :—భీమసేనుఁడు నను మోసగించెనా యేమి ?

బల :—మరెవరిచే నీకిట్టి దురవస్థ తటస్థించినది ?

దుర్యో :—అలింపుఁడు.

చ. ఎవఁడు హరించెఁ దుల్యముగ
నింద్రుని మానముఁ బారిజాతముల్,
ఎవఁడు సరోజ వర్షిశయ
నించును దివ్యసహస్రవర్షముల్,
భువిఁ బ్రియుఁ డుగ్ర భీమగదఁ
బొంది మురారి తటాన, సక్రమా
సాప నిరతప్రియు న్నను స
మర్పణచేసెను మిత్తికిం గటా !!! 32

(నేపథ్యమున)

తొలఁగఁడి, అయ్యలారా ! తొలఁగండి.

బల :—ఇదిగో, శోకాభిభూత హృదయుఁడగు ధృతరాష్ట్రుఁడు గాంధారీ సహితుఁడై, రాణివాసము దన్ననుసరింపఁగా, దుర్జయునిచేఁ జూపఁ బడు మార్గమునఁ దొట్రుపాటు గదిరిన నడకలతో నిటకే యరుదెంచు చున్నాఁడు. ఇతఁడు :—

ఉ. తావగు పీఁకకుల్, సుతశ
తప్రవిభక్త విలోచనుఁడు, ద

ర్వావహ చిత్తుఁడుం, గనక
రంజితయూప విలంబబాహుఁడుం,
దేవపురావనంబున జ
యించిన కంక నరాతి శౌర్యరం
బా విబుధుల్ కరాంజలులఁ
నక్షులఁ జిమ్మి సృజించి రీతనిన్॥ ౩౧

(అంత ధృతరాష్ట్రుఁడు, గాంధారి, దుర్యోధన మహిషు లిరువురు,
దుర్జయుఁడుఁ బ్రవేశింతురు)

ధృత :—పుత్త్రా! నీవెట నున్నావు?

గాం :—అయ్యో! కొడుకా! నీవెక్కడున్నావు. నాయనా

దేవేరులు :—ఎక్కడున్నారు మహారాజ!

ధృత :—హా! ఎంతకష్టము?

కం. అనిఁ గపటమునం బడె మ
త్తనయుఁడు నేఁడనుచు విని యుదారాశ్రువిలో
కనముఖము గలుగు నంధుం
డను, నయితి న్మృవులనంధుఁడను నిపుడకటా॥ ౩౨

గాంధారీ! ప్రాణములతో నున్నదానవా?

గాం :—దురదృష్టవంతురాల్ని జీవంతో ఉన్నాను.

దేవే :—మహారాజ! మహారాజ!

రాజు :—అకటా! కష్టము! నాస్త్రీజనమును విలపించు చున్నది.

గీ. మున్నె యుంగ గదాఘాతముల జనించు
బాధ, దెలిసితి నిప్పు డిప్పగిది. నాదు
నంతిపురము పడంతు లాహవధరిత్రి
నిరవకుంతనలై చొచ్చు టరయుకతన ॥ ३८

ధృత :—దేవి ! గాంధారి !, కనఁబడుచున్నాఁడా దుర్యోధన నామధేయుఁడగు-ఆ కులాభిమాని ?

గాం :—కనపడ్డం లేదండి. మహారాజ !

ధృత :—ఏల కనఁబడఁడు ?—అక్కటా ! వెదకియు నిటఁ బుత్త్రునిఁ గనుఁగొనఁజాలని యంధుఁడనగు నేనిపు డింకను బ్రదికియున్నాను గదా ! ఓయీ, కృతాంత హతకుఁడా !

గీ కలన రిపులను మర్దించు కడిఁది మగలు
వరమతు ల్బిడ్డలను నూఱుగురు కొమరులు
పురమిఁ జెదరిపడిరి, పుత్త్రుఁడిడు నివాప
మొక్కసారియు ధృతరాష్ట్రుఁ డొందఁదగఁడొ ?॥ ३౯

గాం :—నాయనా ! దుర్యోధనా ! - ఇహబైనా చెప్పరాదా ? నూఱుమంది కొడుకుల్ని పోగొట్టుకొని దుఃఖపడుతూండే మహారాజుగారికి సమాధానం చెప్పు తండ్రీ !

బల :—ఇదిగో, యీసాధ్వి, మహారాజ్ఞి గాంధారి.

గీ పుత్త్రపౌత్త్రాస్యములఁ జూచ ముదముఁగనని
కనులుగల సతి, యీ సుయోధనుఁడు వదిన
వనట ధృతిఁదూలి, యశ్రువు లెనయు భర్త్ర
ధర్మచిహ్నము నయనబంధము ధరించె॥ ४०

ధృత.—పుత్రా! సుయోధనా! [illegible] మహారాజ! నీ వెక్కడ నున్నావు?

రాజు:—ఇపుడు నేను నిజముగా మహారాజను.

ధృత:—ఓయీ! పుత్త్రశత జ్యేష్ఠా! నాకుఁ బ్రతివచన మొసంగుము.

రాజు:—ఇదిగో. ప్రత్యుత్తర మిత్తును. ఇట్టివృత్తాంతముచే మిగుల లజ్జించుచున్నవాఁడను.

ధృత:—రమ్ము. కుమారా! నాకు నమస్కరింపుము.

రాజు:—ఇదిగో, వచ్చెదను (లేవఁబోయి పడుట నటించును) అక్కటా! ఇది రెండవదెబ్బ ఔరా! కష్టము!

కం. తలపట్టి యీడ్చి భీముఁడు
బలితపుగదఁ గొట్టినపుడు పడి నా రెండూ
రుంతో సమముగ గుజపా
ముల పాపప్రాణతులకట! తొలఁగించెఁ గదా॥ ౪౮

గాం:—అమ్మాయిలూ! రండి.

దేవే:—అమ్మా! ఇక్కణ్ణే ఉన్నామండి.

గాం:—మీ భర్తగారిని వెతకండి.

దేవే:—దురదృష్ట వంతురాళ్ళం యిదిగో! వెళ్లుతున్నాం.

ధృత:—ఔరా! యెవఁడితఁడు నా వస్త్రముం బట్టికొని లాగుచుఁ ద్రోవ సూపుచున్నాఁడు?

దుర్జ:—తాతగారు! నేను దుర్జయుణ్ణి.

ధృత:—నాయనా! దుర్జయ! మీ తండ్రిగారిని వెదకుము.

దుర్జ:—తాతగారు! నేను చాలా అలసిపోయినాను.

వృద్ధ:—ఇందువది వౌమ్మా! మహారాజుగారి యొడిలోఁ గూర్చుండి యలసట దీర్చికొమ్మా.

దుర్జ:—ఇదిగో, పోతున్నానండి. తాతగారూ!

(సమీపించి)

నాయనగారూ! ఎక్కడున్నారు?

రాజు:—ఇతఁడును వచ్చెనా? సర్వావస్థలయందును హృదయమున నెలకొని యుండు పుత్త్రప్రేమ నన్ను దహించివైచుచున్నది. ఏలనన.

కం. చింతయన నేమియెఱుఁగఁ, డొ
కింతయు, నాయంకమునన యెపుడుఁబరుండుచు
సంతుష్టుండీ దుర్జయుఁ
డెంతే జితు నన్నుఁగాంచి యేమనుకొనునో?॥

దుర్జ:—ఇదుగో, యీ మహారాజుగారు నేలమీఁద కూర్చున్నారు.

రాజు:—పుత్త్రా! ఇక్కడకేల వచ్చితివి?

దుర్జ:—మీ రాలస్యం చేసినారని.

రాజు:—అయ్యో! యిట్టి యవస్థయందును బుత్త్రప్రేమ నాహృదయము నేర్చుచున్నది.

దుర్జ:—నేనూ మీ వొడిలో కూర్చుంటాను. (కూర్చుండుట అభినయించును.)

రాజు:—అకటా! దుర్జయ! దుర్జయ! హా! కష్టము.

కం. సతతమనః ప్రీతికరుం
డతులిత నయనోత్సవుండు నగు, స్వయముగ నీ
సుతుఁడను చంద్రుఁడు. కాల
ప్రతికూలత నగ్నియగుచు భాసిలె నాకున్

దుర్జ :—నాయనగారూ ! నన్ను మీ వొడిలో కూర్చోనీయరేమి ?

రాజు ;—కం. పరిచితమగు నాయొడి విడి
సరగం గూర్చుండుమొక్క సముచితపీఠిన్
దిరముగఁ దొలి నీ వెక్కెడు
పరమాసన మింకలేదు, బాలక ! యిదియున్॥

దుర్జ :—మహారాజుగా రెక్కడికి వెళ్లుతారు ?

రాజు :—నా నూర్గురు సోదరుల ననుసరింతును.

దుర్జ :—నన్నుఁగూడ తీసుకెళ్లరూ ?

రాజు :—నాయనా ! పొమ్ము, భీము నిట్లడుగుము.

దుర్జ :—రండి, నాయనగారూ ! మిమ్మల్ని వెదకుతున్నారు.

రాజు :—ఎవరు నాయనా ?

దుర్జ :—తాతగారు, అవ్వగారు, రాణివాసంలో వారందఱూ,

రాజు :—పుత్రా ! పొమ్ము ; నే రాఁజాలను.

దుర్జ :—నేను మిమ్మల్ని తీసి కెళుతాను.

రాజు :—కుమారా ! నీవింకను బసివాఁడవు.

దుర్జ :—(పరిక్రమించి) అమ్మా ! ఇదుగో, మహారాజుగారు,

దేవే :—హా ! హా ! మహారాజ !

ధృత :—మహారాజేఁడి ?

గాం :—నాకొడు కేఁడి ?

దుర్జ:—ఇరుగో, మహారాజుగారు నేలమీద కూర్చున్నారు.

ధృత :—అక్కటా ! ఆ మహారాజితఁడేనా ?

గీ. మహి వసుస్తంభతుల్య ప్రమాణతనుఁడు,
లోకమున తేండ్ల కెల్ల నేకైక నృపుఁడు,
ఎవఁడొ, యాపతి, నేలఁ దానిట్లు వ్రాలి,
యకట ! ద్వారేంద్రకీలార్ధ మట్టులమరు॥

గాం :—నాయనా ! దుర్యోధనా ! బల్లికగా ఉందా ?

రాజు :—నేను నిజముగా నీ పుత్త్రుఁడనే, తల్లీ !

ధృత :—ఓహో ! ఎవరిది ?

గాం :—మహారాజ ! నేనే, ధైర్యవంతులైన కౌరవులను కన్నదాన్ని.

రాజు :—నన్ను, నేఁడే జన్మించినవానిఁగాఁ దెలిసికొంటిని. తండ్రీ ! యిపుడు దుఃఖించుటవలని ఫలమేమి ?

ధృత :—కుమారా ! దుఃఖింప కెట్లుండగలను ?

కం. వరవీర్య బలోత్సేకముఁ,
బరమాహవయజ్ఞ నియమభరితము, త్వత్సో
దరశతము- మున్నెహత, మీ
వరుగుటతో నెల్లరిపుడు హతమగుదుమగా॥

(నేలపైఁ బడును.)

రాజు :—అకటా పూజ్యపాదులు జనకులు నేలవడిరి. - తండ్రిగారూ !
సాధ్వీమతల్లియగు నా తల్లి నోదార్పుఁడు.

ధృత :—కుమారా : ఏమని యోదార్తును ?

రాజు :—'యుద్ధమున నేను బరాఙ్ముఖుఁడను గాలేను' అని. తండ్రిగారూ !
శోకము చాలించి నన్ననుగ్రహింపుఁడు.

గీ. మందు నసలమ్ము నేని నే మదిఁ దలఁపక
త్వచ్చరణమాత్ర వినతికై తలనువంతు
నెట్టి మానమ్ముతో భువిఁ బుట్టినాఁడ
నట్టి మానమ్ముతో దివి కరుగువాఁడ ॥

ధృత :—

కం. ముదుసలిని, బ్రదుకఁగోరిక
వదలిన కడు పుట్టుగ్రుడ్డివాఁడను, ఎగు నా
కొదవిన యీ సుతశోకము
చెదరిచి ధృతి, మించి నన్నుఁ జేకొనె నకటా ॥

బల :—హా ! కష్టము—

కం. తనపుత్త్రిండగు దుర్యో
ధనునియెడ నిరాశఁగలిగి తపియించెడు నీ
తనికి న్నిత్యాంధునకు
న్నను నిపుడే తెల్పికొనుట నయమగు నెటులన్ ॥

రాజు :—పూజ్యురాలి కిపుడొక విన్నపము.

గాం :— చెప్పవయ్యా ! నాయనా ! చెప్పు.

రాజు :—గీ. ఏ నొనర్చిన సుకృత మేదేని యున్న.
నాకు నీవె మఱొక్క జన్మంబునందు
సైతముం. దల్లివగుదువు గాత!. వేయి
శ్రీలు వలదమ్మ!. మ్రొక్కి ప్రార్థింతునమ్మ!!!

గాం :—నా మనస్సులో కోరికే నీవుకూడ పలికినావయ్యా!

రాజు :—మాలవి! నీవు నాలింపుము.—

చం. బెడిదపుఁ బోరిలో భ్రుకుటి
బెట్టిదమౌగద వ్రస్సిపోయె. నా
కడిఁది యురమ్ము గాయములఁ
గాఱెడు నెత్తురు హారదేశముం
దొడరె. బలాతిదోర్యుగిఁ గ
నుంగొనుమీ. వ్రణకాంచనాంగదా
లడరె. ననిం బరాఙ్ముఖత
నందఁడు నీపతి యేల చింతిలన్॥

మాల :—ఇంకా చిన్నదాన్ని. మీ సహధర్మచారిణిని. కనుకనే యీ విధంగా ఏడుస్తున్నాను.

రాజు :—పౌరవి! నీవును వినుము.

శా. వేదోక్తేష్టులఁ బ్రీతి సల్పితివి వే
వేల్. బంధులం బ్రోచితిన్
నాదాయాదుల మించి పేర్చితి. శ్రితా
నందక్రియ గ్గూర్చితిం,

బాదల్వేట్టితి నెమ్మదింబదిదశా
ల్పాలించు తేండ్లం గలిం,
నాదర్పం బిటుగాంచి వందురఁగ నౌ
నా? త్వాదృశల్, మానినీ ॥

పౌరవి :—సహగమనం చేయవలెనని ఒకటే నిశ్చయంతో ఉన్నాను. దానిచేత నేనింక ఏడవను.

రాజు :—దుర్జయ! నీవును వినుము.

ధృత :—గాంధారి! యిఁకఁదేమి ఎలుకునో?

గాం :—నేనూ దాన్నిగూర్చే ఆలోచిస్తున్నాను.

రాజు :—పాండవులను నన్నువలె సేవింపుము. పూజ్యురాలగు కుంతీదేవి యాజ్ఞల నిర్వర్తింపుము. అభిమన్యుని తల్లిని, ద్రౌపదిని నీతల్లింబోలె గౌరవింపుము కుమారా! చూడుము—

మ. వినుత శ్రీకరుఁ డీసుయోధనుఁడిలం
బెన్మాన దీప్తాత్ముఁ డం
దెను మాతండ్రి మృతిఁ సమానబలు నెం
తేఁ దాఁకి" యంచార్తినిం
గనఁగాఁబోకు, యుధిష్ఠిరోరు విపుల
క్షౌమాపసవ్యంపుఁ గే
లెనయం దాఁకుచు నాకుఁబ్రీతిఁ జలమీ
వే, పాండుపుత్రాళితోఁ॥

బల :—ఔరా! వైరము పశ్చాత్తాపముగ మాఱినది!—ఓహో! అదేదో శబ్దము వినఁబడుచున్నది.

గీ విగత రణదుందుభి రవమ్ము, విశిఖ కవచ
తాళవృంతాతపత్ర విస్తారతలము,
నిహతసారథి భట మిట నింగి నెవఁడొ
ధనువు మ్రోయించు ధ్వాంక్షముల్ దల్లడిలఁగ॥

(నేపథ్యమున)

గీ ఘన శరాసనుఁ డగు సుయోధనునిఁ గూర్చి
చొచ్చిన రణక్రతువు వెండి చొచ్చినాఁడ,
సాంత మగుటను నధ్వర్యుఁ డనఁ రనట్టి
యశ్వమేధమునట్లు నేనకట! యిపుడు॥

బల :—ఓహో! గురుపుత్త్రుఁడగు నశ్వత్థామ యిటే వచ్చుచున్నాఁడు.
ఈతఁడు—

గీ పిరియు తమ్మిచరములట్లు వెడఁదకనులు,
స్వర్ణయూప ఘనదీర్ఘ బాహు యుగము
నెసఁగ, వెస వింటి, రుష లాగు చింద్రధనువుఁ
గొనను గల యగ్నియుత మేరువనఁ దనర్చె॥

(అంతట నశ్వత్థామ ప్రవేశించును)

అశ్వత్థామ :—('ఘనశరాసన'- అను పద్యముం జదువును) సమర సంరంభమున నుభయ సేనార్ణవము లొరయు తరుణమునఁ బైకి లేచిన శస్త్ర నక్రములచే భేదింపఁబడిన శరీరములు గలవారును,— ఒక్కింత మాత్రమే యూర్పుగమిచేఁ గొట్టు మిట్టాడుచున్న ప్రాణములు గలవారును, రణప్రియులునగు రాజేంద్రులారా! మీరెల్ల రాలింపుఁడు.—

గీ. నెపమున హతోరుఁడగు కురునృపతిఁ గాను,
చెడి విఫలశస్త్రుఁడగు సూతుకొడుకఁ గాను,
ద్రోణపుత్త్రుఁడ, నుద్యతాస్త్రుండ, నొకఁడ,
విమతుఁ బొడగన నిల్చితి విజయభూమి॥

కాని కేవలము విజయస్తుతిచే నాకేమాత్రము లాభమొదవని ఈ సమరసన్నాహ దోహలమునఁ బ్రయోజనమేమి ?—(పరిక్రమించి)—కాదు అట్లుగాదు నాపితృపాదులకు నివాపము లొసంగు కార్యమున వ్యగ్రుఁడనయి యున్నపుడుగదా కురుకుల తిలకుఁడగు నీకౌరవేంద్రుఁడు వంచింపఁబడియె. అయినను దాని నెవఁడు విశ్వసించును ?—ఏలయన—

మ. ఎవఁడేకాదశ వాహినీ నృపతులెం
తే మ్రొక్క యేన్గుల్ రథా
లవరోహించియుఁ గేల విండ్లమరఁ, జే
యన్ స్వాజ్ఞ, నొప్పారెనో;
యెవఁడా రామ శరావలీఢ కవచున్
హేవాకు భీష్మున్ రణ
ప్రవణున్ దాత భజించె; నాపతియె పో
రంగూలెఁ గాలాప్తిచేన్॥

మఱి యిపుడా గాంధారేయుఁ డెట నున్నాఁడో గదా ?—(పరిక్రమించి చూచి)—

హా! యిదిగో, అభిహత గజ తురగ నర రథ ప్రాకార మధ్యమున సమర శరధి పారగుఁడగు కురుప్రభుఁడు పడి యున్నాఁడు. ఈతఁడు—

గీ. బొమికికము వీడి కురులరశ్ములు సెలంగ,
నంగముల గదవ్రేట్ల గాయముల నెత్రు
దడుప, సంధ్యావగాహి యస్తమిత తరణి
చరమగిరి మస్తశిల ప్రాలుకరణి వెలిఁగె॥
(సమీపించి)—ఓయీ! కురురాజా! ఏమిది?

రాజు :—గురుపుత్రా! అసంతుష్టికిఁ దగినఫల మిది.

అశ్వత్థామ :—కౌరవేంద్రా! నీకు సత్కారమూలమును మరల నేఁగలిగింతును.

రాజు :—నీవేమి చేయఁగలవు?

అశ్వ :—ఆలింపుము.

గీ. ఆహవోద్యతు, గరుఁడుపై నమరువాని
ఘనచతుర్భుజు, శంఖచక్రధరకరునిఁ,
గృష్ణుని, సపాండుతనయు, సంకీర్ణలేఖ్య
చిత్రపటమట్లు శస్త్రిఁ జెదరనడుతు॥

రాజు :—వలదు. అట్లనకుము.

మ. ధరణీదేవి యొడిం బరుండె నఖిషి
క్తం బెల్లరాడ్వంశముల్,
సురలోకంబును జేరెఁ గర్ణుఁడును, భీ
ష్మందుం బడె, న్నాదునో
దరు లానూర్వురు మత్సమక్షమున యు
ద్ధాన న్మృతింబొంది, రో

గురుపుత్త్రా! మన మిట్టులుంటి మిఁక నీ
కోదండము నీడుమా !॥

అశ్వ :—కురురాజా!

కం. భండన మొనర్చునెడ, నా
పాండుసుతుఁడు కేశసమితిఁ బట్టితివిచి. యు
ద్దండగద నూరుయుగముఁ బ్ర
చండభవద్ధర్మ మొక్కసారి హరించెన్॥

రాజ :—కాదు. నీవట్లనుట తగదు. రాజులు మానశరీరులు. మానార్థమే నే నీనిగ్రహముం బరిగ్రహించితి. చూడు గురుపుత్త్రా!

శా. పాంచాలిం దలవట్టి జూదమున నీ
ద్వ్యన్ లేదె హ స్తంబుతో.
నెంచంబో కభిమన్యు బాలుఁడవియేన్
హింసింపలేదే. సుతుం.
బంచంలేనె వనాశి కష్టములచే
వంచించి యవ్వారి. నే
కించిత్తో యిఁక వారు చేసినది న
న్నిర్దర్పు సల్పన్ సఖా :॥

అశ్వ :—నేను మనః పూర్వకముగ నపుడే నిశ్చయించు కొంటిని.

కం. ఇదిగో. నీకయి. నాకయి.
కదనమునం బడిన వీరకాండుబునకై
విదితముగఁ బ్రతిన పట్టితిఁ
ఇదుపుడు నేఁ బాండవుల నిశాసమయమునన్॥

బల :—గురుపుత్త్రుఁడు వచించినట్లే జరుగఁ గలదు.

అశ్వ :—పూజ్యుఁ డీతఁడు బలరాముఁడు!

ధృత :—అకటా! వంచనము ప్రత్యక్షమయినది కదా!

అశ్వ :—మర్యాదయా! యిటు౯మ్ము.

కం. నిజజనకుఁడు విక్రమమున
భుజబలమునఁ గనిన రాజ్యమున కభిషేకా
ది జిఘృక్షలు లేకయ, భూ
భుజుఁడవుగా వెలయుమయ్య - భూదేవోక్తిః

రాజు :—ఆహా! హృదయప్రీతి సంధించితి. నాయసువు లరుగునట్లున్నవి. ఇదిగో. యిట నా పితృ పితామహాదులగు శంతను ప్రభృతులు! కర్ణాగ్రసరులగు నా నూర్వురు సోదరులదే విలిచియున్నారు. ఇదిగో యిక్కడను గాకపక్షధరుఁడగు నభిమన్యుఁ డైరావత మధిరోహించి, యింద్రుని హస్తమవలంబించి, నాతోఁ గ్రుద్ధుఁడై యేదియో పలుకుచున్నాఁడు ఊర్వశ్యాద్యప్సరోంగనలు నన్నుఁ బారి వేష్టించి యున్నారు. ఇవిగో, మూర్తిమంతములగు మహార్ణవములు! ఇవిగో గంగాప్రముఖ మహానదులు: కాలుఁడిదే, ననుఁదేర వేయి రాయంచలు పూన్పఁబడిన వీరవాహినియగు విమానముం బంపి యున్నాఁడు. ఇఁక నిటఁ బోయివత్తును (దివంగతుఁ డగును).

(యవనిక దిగజాఱును).

ధృత :—

చం. ముని సుమనోధనమ్ములఁ ద
పోవన భూముల నాశ్రయించెదన్
దనయుల శోకదన్ విఫల
తం గను రాజ్య మిపీః నశించుతన్

అశ్వ :—

చనియెద బాణపాణినయి
సౌప్తిక సంహరణార్థ,మే, నిదేః

(భరత వాక్యము)

బల :—

మన జనపాలకుం దరుల
మట్టడఁగించి ధరిత్రి నేలుతన్॥

(ఎల్లరు నిష్క్రమింతురు)

శ్రీ—శ్రీ—శ్రీ



